# తరణోపాయము



ఇది భక్తిరసమగు గ్రంథము. ఉపనిషత్తులు, గీతా భాష్యము, జ్ఞానదీపిక మొదలగు పూర్వకాలపు వేదాంత గ్రంథములయొక్క సారమును గ్రహించి ముఖ్యమైన విషయములను వచనపూర్వకముగాను, అవసరమగు చోట్లయందు శ్లోకములను అర్థసహితముగాను వ్రాయుచు పిల్లలకు గూడ తెలియునటుల అనుభవముగల ఉదాహరణములు గనబఱచుచు, భక్తి, జ్ఞాన, వైరాగ్యములను సులభముగా తెలియజేయు ననేక విషయములను వ్రాసియున్నాను. సర్వజనులకు నిదియే తరణోపాయమని నమ్మవలెను. ముముక్షువులందఱు దీనిని ముఖ్యముగా జదివి తీరవలెను. దీని ఖరీదు వి. పి. ఖర్చులు సహితముగా రు 1—0—0 యి మాత్రము అగును. కావలసినవారు యీ దిగువచిరునామాకు వ్రాయుడు.

గ్రంథకర్త
ఆకెళ్ల వేంకటశాస్త్రి
గోపాలపురం
కొత్తపేటపోష్టు, తూర్పుగోదావరిజిల్లా.

# పీఠిక.

ఈశతకము 105 పద్యములను కలిగి, బాలురకును, బాలికలకును, తదితరులకును కూడ, మిక్కిలి యుపయోగకరముగ నుండునటుల వ్రాయబడినది. దీనియందు పెక్కునీతులు ఉపమానఉపమేయములతో చక్కగ సమకూర్చబడినవి.

దీనిని పరిశీలించిన నా స్నేహితులు కొందఱు, దీనిని పాఠశాలలయందు నెలకొలిపినయెడల, బాలురకును, బాలికలకును, మిక్కిలి సమంజసముగా నుండునని, ప్రోత్సాహపరచినందున, దీనిని పాఠశాలలయం దుపయోగించుటకు ప్రయత్నించుచున్నాను.

ఆధునికగ్రంథములలో పాఠశాలలకు యితరగ్రంథములకంటె, నీతిని గఱపు నిట్టిగ్రంథముల నేర్పఱచుట, సర్వజనాదరణీయము గనుక, పాఠశాలాధికారులును, విద్యాశాఖాధికారులును, ఈ శతకమునందు గల పద్యసారాంశములను గ్రహించి, దీనిని పాఠశాలలయందు నెలకొలుపుదురని కోరుచున్నాను.

ఇది 3, 4, 5, తరగతులలోని బాలురకు మిక్కిలి ఉపయోగకరముగా నుండునని నాయభిప్రాయము. గనుక నిది, ఆచంద్రస్థాయిగా నుండుటకు భగవంతుడు తగు సహాయము నొసగుగాక.

ఇట్లు గ్రంథకర్త
ఆకెళ్ల వేంకటశాస్త్రి
దైవజ్ఞుడు
గోపాలపురం, కొత్తపేట పోష్టు తూర్పుగోదావరిజిల్లా

శ్రీరస్తు

# సుగుణ శతకము.

కం. శ్రీరాముడె దైవం బని
శ్రీరాముని నమ్మియుండి చిత్తములోనన్
శ్రీరాముని స్మరియించిన
శ్రీరాముడె నిన్ను గాచు సిద్ధము సుగుణా. 1

కం. శ్రీరాముని దయచేతను
నాగారను సకలజనులు నోహో యనగా
హేరాళమైన నీతులు
ధీరుల్ మదిమెచ్చుగొనగ దెలిపెద సుగుణా. 2

కం. సర్వేంద్రియవర్జితుడును
సర్వవ్యాపకుడు నైన సర్వేశ్వరుడున్
సర్వావస్థలయందును
సర్వజ్ఞుం డొసగు మనకు సకలము సుగుణా. 3

కం. గణనాథుని పూజింతురు
గుణవంతులు ముందుగాను గోర్కెలు దీరన్
ప్రణవము మంత్రంబులలో
గణనకు మును వచ్చునట్టి కరణిని సుగుణా.

కం. జగతిని గల మనుజులలో
సుగుణంబులు గల్గువాడె సౌఖ్యము నొందున్
సుగుణములకెల్ల మూలము
సుగుణాత్ములతోడ చెలిమి సుమ్మీ సుగుణా.

కం. పరులకు నపకృతి సేయుట
పరభామలతోటి పొందు పరధనమున్
గురువులతో వైరంబును
నిరయంబునకెన్నదగిన నెలవులు సుగుణా.

కం. జననీజనకుల సేవయు
వినయోచితమైనయట్టి విద్యయు నెపుడున్
గనికరము గల్గు మనసును
మనుజులకివి యబ్బుటరుదు మహిలో సుగుణా.

కం. వయ్యాలితోడ చెలిమియు
పలుబాములు పెట్టునట్టి ప్రభువుల కొలువున్
కులకాంతతోడ వైరము
కలకాలము నీకు దెచ్చు కష్టము సుగుణా.

కం. చిత్తము చంచలమైనను
పెత్తన మిసుమంతలేని పెనిమిటియున్నన్
మత్తెక్కు భార్యయున్నను
కత్తెరి యింతింతగాదు గదరా సుగుణా. 9

కం. పెద్దలతో సహవాసము
అద్దమువలె సాయపడును నన్నిటియందున్
వద్దని వాదము సేయుచు
ముద్దులతో గూడిమనుట మోసము సుగుణా. 10

కం. పెరుగునుపో ఋణమెప్పుడును
తరుగునుపో నాయువెప్పుడు తప్పక రెంటిం
బరికించి జూడకుండిన
పరివేదన దెచ్చునీకు భద్రము సుగుణా. 11

కం. ఉత్తములగు సఖులున్నను
బిత్తరులగు కొడుకులున్న పెన్నిధియున్నన్
సొత్తుగల భార్యయున్నను
సత్తువగల దేహమున్న సౌఖ్యము సుగుణా. 12

కం. తనసతి గయ్యాళైనను
అనుమానము తట్టుచున్న నన్నిటియందున్
తనబాధ దైవమెరుగును
తనవారికి గూడ బాధ తప్పదు సుగుణా. 13

కం. కానదు ఘూకము పగటిని
కానదు కాకంబు రాత్రి కామాంధుండున్
గానడు రేయింబగలును
గానము మనమెల్ల భావికాలము సుగుణా. 14

కం. విడువవలె దుష్టసంగతి
విడువంగావలెను మిషను విశ్వములోనన్
విడువవలె పరులధనమును
విడువంగావలదు హితుని వినరా సుగుణా. 15

కం. హరిదాసుల దూషణమును
పరభామల భాషణంబు బాధగునీకున్
కరుణానిధి శరణంబును
శరణాగతరక్షణంబు సౌఖ్యము సుగుణా. 16

కం. కులటకు పతియే శత్రువు
కులమునకున్ శత్రువెపుడు కుజనసుతుండున్
నెలయే శత్రువు దొంగకు
ఖలునకు శత్రువు హితుండు గదరా సుగుణా. 17

కం. పతియే గతియని నమ్మిన
సతికెప్పుడు లోటురాదు చక్కగ వినుమా
సతియే పతికెదురాడిన
గతులన్నియు తప్పిపోవు గదరాసుగుణా. 18

కం. ఆలుసుమీ పతిప్రాణము
పాలుసుమీ ప్రాణమెల్ల పసిపిల్లలకున్
గాలిసుమీ మనప్రాణము
వ్రాలుసుమీ ప్రాణమెల్ల వ్రాతకు సుగుణా. 19

కం. రాదుసుమీ నరజన్మము
కాదుసుమీ యిహమునందు గల్గుసుఖంబున్
పోదుసుమీ యపవాదము
పోదెసుమీ నీతులెల్ల శుంఠకు సుగుణా. 20

కం. ఓడకుమీ సతికెవ్వాడు
వాడకుమీ పరధనంబు వాదులువచ్చున్
గూడకుమీ దుర్జనులను
చూడకుమీ పరులసతుల సొంపుగసుగుణా. 21

కం. ఋతమున సంపద గలుగును
సతతాభ్యాసంబుచేత చదువునుగల్గున్
గతకృతకర్మను బుద్ధియు
వితరణమున కీర్తిగలుగు వినరా సుగుణా. 22

కం. తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనహితుండు తథ్యముగాగన్
తనగుణమే తన్నసంపద
తనధర్మమె తనకుముక్తి తలపగ సుగుణా. 23

కం. ఉపకారి కుపకారము
నపకారము చేయబోకు మన్యులకెపుడున్
అపకారము నొనరింపక
శ్లాఘ్యుండై మనుట మేలు సతతము సుగుణా. 24

కం. తనయులు లేనిగృహంబును
ధనమును ధాన్యంబు లేని దాతల బ్రతుకున్
పెనిమిటి కొప్పనిసతియును
వినయంబును లేని చదువు వృధరా సుగుణా. 25

కం. పెక్కురు కుమతులు కన్నను
నొక్కడె సూనుండు మేలు నుత్తముడైనన్
చుక్కలు పదివేలున్నను
చుక్కలరేడొప్పునట్లు సొగసుగ సుగుణా. 26

కం. నరజన్మ దొరకినందుకు
తరణోపాయంబు గనుట ధర్మము సుమ్మా
పరహింసాతత్పరులకు
పరమార్థ మదేల తెలియు పాపము సుగుణా. 27

కం. మన పెద్దలు గడియించిన
ధనమంతయు గడియలోనె తరుగగ వచ్చున్
మనకది శక్యమె నిలుపగ
పనివడి పదియేండ్లు కష్టపడినను సుగుణా. 28

కం. అర్థము వ్యర్థము జేయుచు
తీర్థము లాడంగనేల తిరిపముగొనుచున్
ప్రార్థించువారి కొసగిన
యర్థము సార్థంబుగాదె యనిశము సుగుణా. 29

కం. తెలియనివానికి తెలియదు
తెలిసినవాడెన్నడైన తెలివిగనుండున్
తెలిసియు తెలియనివాడే
తెలివిని గనిపెట్టి మనుట తెలివిర సుగుణా. 30

కం. మును జేసిన బుణ్యంబున
ధనమును ధర్మంబు దయయు దాక్షిణ్యంబున్
తనయులు సద్గుణసతియును
మనుజులకివి గలుగు నెప్పుడు మహిలో సుగుణా. 31

కం. తను సేవించెడు వారినె
ననిశము దేవుండుగాచు నదియెట్లన్నన్
జననియు తనదనయులలో
వినయాత్మజు నెచ్చుజూచు ప్రేమను సుగుణా. 32

కం. అతిలోభంబున కౌరవు
లతియీావిని బలియు మున్ను హాతులైరిగదే
ప్రతికార్యమందు తప్పక
అతి వదలుట మేలు నీకు ననిశము సుగుణా. 33

కం. దుర్మతివై కడునీచపు
కర్మములను చేయకుండ కష్టముతోడన్
నిర్మలబుద్ధి నొనర్చెడు
ధర్మమె నిన్నెపుడుగాచు దథ్యము సుగుణా. 34

కం. యెప్పటికైనను మృత్యువు
తప్పదుమనకంచు నెఱిగి ధర్మముతోనే
యెప్పటికప్పుడె మెలగెడు
నప్పురుషుడె ధన్యుడగును నవనిని సుగుణా. 35

కం. ఎందరు రాజులు మడిసిరి
యెందరు మరిజోగులైరి యిన్నియుగనుచున్
గుందడు కొంచెంబైనను
ముందరగతి యేమియనుచు మూర్ఖుడు సుగుణా. 36

కం. దేహముకల్లని దెలిసియు
మోహంబున మునుగనేల మూర్ఖుడవగుచున్
ఆహుతి యేదో యమునికి
నూహాను తెలియంగవలయు నొప్పుగ సుగుణా. 37

కం. మానసమే సుఖమిచ్చును
మానసమే దుఃఖమిచ్చు మరినూహింపన్
మానసమే స్థిరమైనను
మానసమే ముక్తినొసగు మహిలో సుగుణా. 38

కం. మనసారగ తనుజేసిన
పను లెన్నడు తప్పిపోవు పరిశీలింపన్
కనులారను గనుచున్నది
మనసానకగానబడదు మనకది సుగుణా. 39

కం. మనసానరించెడు పాపము
తనువెన్నడు చేయదటుల తద్విధమరయన్
వనితా లింగిత దేహము
తనయాలింగితము గాదె తలపగ సుగుణా. 40

కం. మృత్యువు చేరువ నుండగ
నిత్యము మనకేది యనుచు నిమిషంబైనన్
సత్యము దలపని మనుజుని
గత్యంతరమేమి యగునొ గానవె సుగుణా. 41

కం. జననము మరణముకొరకే
వనజాక్షుల తోటిపొందు వాదులకొరకే
అనయము నిరయము కొరకే
వినయము తనమేలుకొరకె వినరా సుగుణా. 42

కం. అన్నము పెట్టుటకన్నను
మిన్నగు ధర్మంబులేదు మేదినిలోనన్
మిన్నక జీవులజెంపుట
కన్నను పాపంబులేదు గదరా సుగుణా. 43

కం. మనసున వాక్కున కర్మను
ననయంబును దేనినైన నపకారంబున్
పనివడి చేయకయుండెడు
మనుజుండే ముక్తిగాంచు మహిలో సుగుణా. 44

కం. పతికిద్దరు సతులున్నను
పతివర్జితయైన యట్టి భగినియునున్నన్
ప్రతికూలుడు సుతుడున్నను
సతతంబును గలుగునయ్య జగడము సుగుణా. 45

కం. త్యాగముకన్నను సుగుణము
భాగ్యముకన్న మిగుల పాడుగుణంబున్
త్రాగుడుకన్నను వ్యసనము
యోగతిసిం గానమయ్య నెందును సుగుణా. 46

కం. వెలయుగ సుకృత మొనర్చియు
కలుషంబున కెడముగలుగ కడకది తరుగున్
జలపూరిత ఘటమందలి
బిలముననే పోవు నీటివిధమున సుగుణా. 47

కం. పరువు ప్రతిష్ఠయు లేకయె
చిరకాలము బ్రతుకునట్టి జీవితమేలా
ఉరకయె బ్రతికెడు కాకము
చిరజీవిగ నున్న నేమి చేకురు సుగుణా. 48

కం. ఘనసుగుణము విద్యయబ్బిన
ఘనసౌఖ్యమె గాక మరియు గాంచును యశమున్
కనకము తావిని జెందగ
ఘనముగ శోభిల్లునట్లు గద రా సుగుణా. 49

కం. పూర్ణపయత్నము దేవుని
కారుణ్యము లేక కడకు కానేరదు మీ
పైరులు పండునె యెన్నడు
సారంబగు వృష్టిలేక చేకుఱగ సుగుణా. 50

కం. మును జేసిన కర్మమునం
దనఫలమే తనకుగాక తాకునె యొరులన్
తనతల్లి మంద నుండగ
చేనుగుడువగ క్రేపు జేరు చందము సుగుణా. 51

కం. పసగొను కవితారసమది
రసికునికే పొసగుగాని రాదన్యులకున్
ప్రసవావేదన దెలియునె
ప్రసవించెడు స్త్రీకిగాక వంధ్యకు సుగుణా. 52

కం. మనగడన మంచిదైనను
ననిశము దేవుండు దాని కనుకూలుడగున్
అనలం బించుక యున్నను
అనిలునిచే ప్రజ్వరిల్లు నట్టుగ సుగుణా. 53

కం. ఏరీతినైన నొరులకు
నోరంతయు నుపకరించు గుణియగునతఁడున్
నోరెఱుఁగని పశువులు మన
కేరీతిగ పాలొసంగు నెఱుఁగవె సుగుణా. 54

కం. తొలిజేసిన ప్రారబ్ధం
బిలలో తాననుభవించు నెవ్వండైనన్
తలక్రిందుపక్షి యట్టుల
తలక్రిందుగ నుండనేమి తలఁపవె సుగుణా. 55

కం. ఇతరుల చెరుప దలంచిన
నతఁడే చెడిపోవు పిదప నదియెట్లన్నన్
సతియగుసీతను రావణు
డతివలపున దెచ్చి నాశ మందఁడె సుగుణా. 56

కం. ఎన్నకగను పండితుఁడై
యున్నను శీలంబులేక యొప్పునె యతఁడున్
కన్నులు గానని వానికి
నున్నని యద్దంబదేల నుడువవె సుగుణా. 57

కం. చేరువ నున్నను ఖలజనుం
డారయలేఁ డొరులగుణము నజ్ఞానమునన్
చేరువ నున్నను కప్పలు
సారసరస మూనలేని చందము సుగుణా. 58

కం. తనకుగల దానితోడనె
తనివిగ జీవించువాడె ధన్యుడు సుమ్మా
వననిధి దిరిగెడు మీనము
వనమునునే బ్రతుకునట్టి వడుపున సుగుణా. 59

కం. తనబుద్ధియె సుఖమిచ్చును
యినుమడిగా గురునిబుద్ధి యిచ్చుసుఖంబున్
తనకంతము పరబుద్ధియె
వనజాక్షులబుద్ధి యెప్పుడు ప్రళయము సుగుణా. 60

కం. పరిశీలించిన కొలదిని
పరమాత్మను తెలిసికొనగ వశమగుకడకున్
తరచినకొలదిని పెరుగును
సరసంబగు వెన్న దొరకు చందము సుగుణా. 61

కం. ఒరులకు నపకృతి లేకయె
సరసంబుగ ధనముగూర్చు సజ్జనుడెప్పుడున్
విసులకు నష్టము లేకయె
సరఘులు సమకూర్చు తేనె చందము సుగుణా. 62

కం. ఎఱుగక చేసియు పురుషుడు
దురితఫలంబనుభవించు తోడనె యతడున్
ఎఱుగక ననలము ముట్టిన
చిఱుతను నది కాల్చకున్న చిత్రము సుగుణా. 63

కం. అలసుడు ఘనునిం జేరిన
చెలువున తా ఘనత జెందు చిత్రముగాగన్
అలరుల జేరుచు దారము
వెలదుల కంఠంబునందు వెలయదె సుగుణా. 64

కం. ఘనుడే యల్పుని జేరిన
తనఘనతకు లోటురాక తప్పదుసుమ్మీ
వనమున తెప్పను తేలదె
ఘనముగ నున్నట్టిరాతి కంబము సుగుణా. 65

కం. ఖలుడే ఖలులను జేరును
కలనైనను సాధు చెలిమి గానడుసుమ్మీ
మలమును దరియెడు పురుగులు
మలయజమున కెట్లుజేరు మహిలో సుగుణా. 66

కం. బలముగలవాడు శాంతము
గలవాడై యున్నయెడల గణ్యత జెందున్
పలుబాములొనగు తనయుల
పలువిధముల సైచు తల్లి వడువున సుగుణా. 67

కం. మితిమీరి యాసగొనియెడు
ప్రతిమనుజుడు తప్పకుండ భంగము జెందున్
అతియాస నెఱకు బోయెడు
ప్రతిమీనము మృతిని జెందు వడువున సుగుణా. 68

కం. చెనటులు సంపాదించిన
ధనమంతయు నొక్కసారె తలఁగును సుమ్మీ
ఘనముగ బెరిగెడు వృక్షము
పెనుగాలిని గూలునట్టి విధమున సుగుణా. 69

కం. పొలుపగు సతి తనకున్నను
కలుషాత్ముఁడె గోరు నితర కాంతల నెపుడున్
పలుదెఱగుల నీరుండియు
బలిపుష్టము కడవజేరు చెండము సుగుణా. 70

కం. కవిలేని సభలవెల్లను
రవిలేని నభంబు మాడ్కి రాజిల్లవు నిల్
చెవిలేని కూరలెల్లను
భువిలో నవి యెట్లు పొసగు భుక్తికి సుగుణా. 71

కం. అరయఁ మహాత్ముల యశమది
దురితాత్ముల చెలిమివలన దొలఁగదు సుమ్మీ
ఉరగావృతమగు చందన
తరువునకుం బరిమళంబు తలఁగునె సుగుణా. 72

కం. కవనము సంగీతంబును
భువిలో నివి లభ్యమగుట పుణ్యముగాదే
యివిగొని బ్రహ్మానందము
చేవిగొనలేనట్టివాడు జడుడగు సుగుణా. 73

కం. నిరుపేదయు మూర్ఖుండును
పరవాసియు నిత్యరోగి పరసేవకుడున్
నిరతము బ్రతుకుట కన్నను
మరణంబే శ్రేయమండ్రు మాన్యులు సుగుణా. 74

కం. దినములు వ్యర్థము సేయక
దినమునకొక నిమిషమైన దేవుని మదిలో
పనివడి గొలువని మనుజుడు
మనుజుండే పశువుగాని మహిలో సుగుణా. 75

కం. దేహాభిమాన ముండగ
మోహంబును విడువగలడె మూర్ఖుండెప్పుడున్
సాహసమున నదివిడిచిన
బాహాటముగాను జెందు పరమును సుగుణా. 76

కం. ధనమును మనసును రెండును
చేనువుగ నున్నంతవరకు సౌఖ్యము లేదే
యనుచిత ముచితము నెఱుగని
మనుజునకవి యేలవిడును మహిలో సుగుణా. 77

కం. ప్రథమమున తత్త్వచింతయు
ప్రథితంబగు శాస్త్రచింత పదపడి వెలయున్
అధమమగు దానచింతయు
నధమాధమమగును తీర్థయాత్రలు సుగుణా. 78

కం. పరహితుడే యుత్తముడగు
యిరుదెసలను మధ్యముండు హితుడై యొప్పన్
పరవైరియె యధముండగు
నిరుదెసలకు వైరి యెట్టి హీనుడో సుగుణా. 79

కం. కుజనుడు చెప్పియు చేయడు
సుజనుం డటుచెప్పకుండ సొంపుగ జేయున్
ప్రజలకు నుండెడు గుణముల
నిజమును గనుగొనుటకిదియె నీతిర సుగుణా. 80

కం. తనకుపకార మొనర్చెడు
జనునకె కడుకీడు జేయ జేసబోయెడు న
చ్చెనటికి ఘనమై యొప్పెడు
శునకము పదిరెట్లు మేలు జూపును సుగుణా. 81

కం. దయలేని యాగమేలను
దయలేకను దానమేల ధర్మంబేలా
దయలేని రాజ్యమేలను
దయమాలినబ్రతుకదేల తలపగ సుగుణా. 82

కం. ఎయ్యది ముక్తికి తెరువగు
నెయ్యది సుగుణంబులందు హెచ్చును ఘనమై
ఎయ్యది భక్తికి మొదలగు
నయ్యదియే నీతియంద్రు నవనిని సుగుణా. 83

కం. పొడచిన తిట్టిన కొట్టిన
పడి యూరకయుండుగాని ప్రాజ్ఞుడు మఱితా
నొడబడడు మారుసేయఁగ
విడువడు ధర్మంబు నెప్పుడు వినరా సుగుణా. 84

కం. చంచలమగు సంసారము
చంచలములు జీవనంబు జవరాండ్రు సుతుల్
చంచలమగు సిరియు ప్రాణము
చంచలనము లేని దొక్క సత్యమె సుగుణా. 85

కం. వేఁచుచు నెంతఁగ జెప్పినః
వీడడు తన పాడుగుణము వెంగలి యెప్పుడున్
గాడిదకు గంధమలదిన
బూడిదలో పొరలునట్టి పోలిక సుగుణా. 86

కం. బాలిశుని జేరనిచ్చిన
పాలకునే జెరుపజూచు పాపపుబుద్ధిన్
పాలోసగి యెంత బెంచిన
వ్యాళము తనుగఱవజూచు భంగిని సుగుణా. 87

కం. తెఱవలు జాణతనంబున
నెఱుకను గలవారినైన నెరగొందురుమీ
తెరవాటుకాడు తెరువున
తెరువరులను గొట్టునట్టి తెఱగున సుగుణా. 88

కం. నీతిగ శ్రమపడి చేసెడు
చేతకు తగునట్టిఫలము చేకురు సుమ్మీ
నూతని లోతుగ త్రవ్విన
పాతాళపుగంగ దొరకు భంగిని సుగుణా. 89

కం. కల్లకు కల్లయె బలమగు
పిల్లలకుం దల్లియెప్పుడు పెద్ద బలంబౌ
నల్లికి స్వేదము బలమగు
నెల్లరకును నీతి బలము యెఱుగగ సుగుణా. 90

కం. జూదము నాడిన యెడలను
ఖేదంబును జెందెదీవు కీనాశుడవై
మేదినికెల్లను ప్రభువయి
జూదంబున నలుడు చెడడె చొరబడి సుగుణా. 91

కం. సత్యము తప్పకయుండిన
నిత్యము కడుమేలుగలుగు నిజముగ నీకున్
సత్యము విడువని కతమున
సత్యహరిశ్చంద్రుడయ్యె జగతిని సుగుణా. 92

కం. మ్రాకున ననలముభంగిని
నాకసమున గాలిభంగి నందఱిలోనన్
డీకొని దేవుండుండగ
చేకొనలేకుంకి జూడ జిత్రము సుగుణా. 93

కం. హరికథలు వినెడువారికి
హరిపూజలు చేయువారి కనవరతంబున్
హరినే నమ్మినవారికి
హరియే సమకూర్చునెపుడు నఖిలము సుగుణా. 94

కం. కనుమూసి యరసి జూచిన
గనవచ్చును జగతిలోని కల్ల నిజంబుల్
కనుదెరచి దీసి నిజేమును
ఘనుడైనను గానలేడు గదరా సుగుణా. 95

కం. భక్తిని సేవించినయెడ
ముక్తిని దా జెందగలడు మూర్ఖుండైనన్
శక్తికి జాలని వుడుతయె
భక్తిని సేవించి బొందె పరమది సుగుణా. 96

కం. వెలయును జంద్రుడు రాత్రిని
వెలయును సూర్యుండు పగలు విశ్వములోనన్
వెలయు సుపుత్రుడు కులమున
వెలయును ధర్మంబు నెల్లవేళల సుగుణా. 97

కం. అరయగ లుబ్ధుం డెపుడును
సిరి యుండియు సుఖము తాను జెందదు సుమీ్మ
తఱచుగ చేనికె గట్టెడు
వెఱబొమ్మను బోలునట్టి విధమున సుగుణా. 98

కం. ఎనుబదినాలుగులక్షల
జననంబులు దాటియుండి చయ్యన నిపుడీ
మనుజుండై జన్మించియు
వినియోగము లేనివాడు వృథరా సుగుణా. 99

కం. బుద్ధికి మనసే విషముగు
బద్ధకునకు భోజనంబు బహు విషమంబౌ
వృద్ధునకు తరుణి విషముగు
నిద్ధరనందఱికి విషము ఋణముగు సుగుణా. 100

కం. పొరపాటునునది నిజేముగ
పొరపాటున వచ్చుచుండు బుధునకు నైనన్
పొరపాటెన్నుట కన్నను
పొరపాటిక లేదు మనకు పుడమిని సుగుణా. 101

కం. తప్పులు గనబడుచున్నను
యొప్పులనే సంగ్రహించు నొప్పుగ బుధుడున్
నెప్పున నీరును విడుచుచు
తెప్పున పాల్ద్రాగు హంస తెఱగున సుగుణా. 102

కం. ఆకెళ్ల వంశమందున
ప్రాకటముగ జననమంది పద్యశతంబున్
జేకొని వేంకటశాస్త్రియె
శ్రీకాంతుని కరుణవలన జేసెను సుగుణా. 103

కం. వ్రాసి సుగుణశతకము
నే పామరుఁడైన విన్న నేర్పడి చదువన్
గోపాలపురాధీశుఁడు
గోపాలకకృష్ణుఁ డిచ్చు కోర్కెలు సుగుణా. 104

కం. మంగళమగు భూపతులకు
మంగళమగు సతులకెపుడు మాన్యులకెల్లన్
మంగళమగు గోసమితికి
మంగళమగు రామచంద్ర మహిమను సుగుణా. 105

—సంపూర్ణము—



## ఇంగ్లీషు తేదీలకు వారములను కనుగొనుట.

ఇంగ్లీషు సం॥రములలో నేసం॥రములలో నైనను ఏనె లలో నైనను ఏ తారీఖునకైనకు ఆనాటివారమును సులభముగా తెలిసికొనవచ్చును.

కం. శతవర్ష మాస ధృవముల
ప్రతి తేదియు గలుపుచుండి పర్వతసంఖ్యన్
ప్రతివారును విభజించిన
ప్రతి శేషము వారమగును వారపువరుసన్.

అనగా శతధృవము, వర్షధృవము, మాసధృవము, ఇవిమూడును కలిపి ఆ మొత్తములో మీరుకోరిన ఇంగ్లీషు తారీఖును కలిపి యామొత్తమును 7చేత భాగించినయెడల కొంత శేషము వచ్చును. ఆ శేషసంఖ్యను ఆదివారము మొదలుగా లెక్కించినయెడల సరిగా మీరుకోరినవారము వచ్చును. శేషము రానియెడల శనివారము అని తెలుసుకొనవలెను.

### శ త ధ్రు వ ము.

1800 సం॥ మొదలుకొని 1899 సం॥రం ఆఖరువరకు 4 శతధ్రువమగును.

1900 సం॥రం మొదలుకొని 1999 సం॥రం. ఆఖరువరకు 2 శతధ్రువమగును.

### వ ర్ష ధ్రు వ ము.

కం. నాలుగుచేతను నబ్దము
పాలుంగొన వచ్చు న విభక్తముదానిన్
మేలున గలుపుచు యేడున
పాలుంగొన మిగులునదియె వర్షధ్రువమా.

ఏసం॥ రమునకు వర్ష ధ్రువము గనుగొనవలెనో దానిని 4 చేత భాగించి ఆవిభక్తమును ఆసం॥రసంఖ్యలో నే కలిపి ఆమొత్తమును 7 చేత భాగించగా మిగిలిన శేషము వర్ష ధ్రువమగును.

వర్షధ్రువమున కుదాహరణము. 31, 32, సం॥రములకు వ్రాయుచున్నాము.

31ని 4 చేత భాగించగా 7 విభక్తమువచ్చును ఈవిభక్తమగు 7ను 31లో కలపగా 38 అయ్యెను. దీనిని 7చేత భాగించగా శేషము 3 వచ్చినది యిదియే వర్ష ధ్రువము. 32ను 4చేత భాగించగా 8 విభక్తమువచ్చును. ఈవిభక్తమగు 8ని 32లో కలపగా 40 అయ్యెను. దీనిని 7చేత భాగించగా శేషము 5 వచ్చినది యిదియే వర్ష ధ్రువము. అనగా 31వసం॥రమునకు 3ను 32వసం॥రమునకు 5ను వర్ష ధ్రువములగును అని మనకు తెలియుచున్నది

మాస ధ్రువము.

కం. ఆఱును రెండును రెండును
సారసముగ నైదు నేడు జనునట మూడున్
జేరువనైదును నొకటియు
ఆరయ నాల్గారు రెండు నటుపై నాల్గున్.

| | | | |
|---|---|---|---|
| జనవరి | 6 | జూలై | 5 |
| ఫిబ్రవరి | 2 | ఆగష్టు | 1 |
| మార్చి | 2 | సెప్టెంబరు | 4 |
| యేప్రియలు | 5 | అక్టోబరు | 6 |
| మేయి | 7 | నవంబరు | 2 |
| జూన్ | 3 | డిశంబరు | |

ఈపైన ఉదాహరించినప్రకారం ప్రతినెలకు మాసధ్రువములు కలుపుకొనవలెను. గాని,

లీపు సం॥రమున ఫిబ్రవరు నెలకు 1టియు జనవరినెలకు 5ను మాసధ్రువములగును. అనగా లీపుసం॥రములలో జనవరి ఫిబ్రవరు నెలలకు పై మాసధ్రువములలో 1సంఖ్య తగ్గును.

1 ఉ దా హ ర ణ ము.

1931 సం॥ డిశంబరు 30 తారీఖున వారమును గనుగొందము.

| | |
|---|---|
| 1900 సం॥రమునకు శతధ్రువము | 2 |
| 31 వ సం॥రమునకు వర్షధ్రువము | 3 |
| డిశంబరు నెలకు మాసధ్రువము | 4 |
| డిశంబరు నెలలో కోరిన తారీఖు | 30 |
| మొత్తము | 39 |

యీ మొత్తపు సంఖ్యయగు 39ని 7 చేత భాగింపగా 4 శేషమువచ్చినది. యీ 4 ను ఆదివారములగాయితు వరుసగా లెక్కింపగా బుధవారమయినది.

అనగా 1931 డిశంబరు 30 తారీఖున యేవారమయినదో మీమీ పంచాగములను డైరీని చూచుకొనుడు.

2 ఉదాహరణము.

1932 ఫిబ్రవరినెల 18 వ తారీఖున వారమునుగనుగొందము.

| | |
|---|---|
| 1900 సం॥రమునకు శతధ్రువము | 2 |
| 32 సం॥రమునకు వర్షధ్రువము | 5 |
| ఫిబ్రవరు నెలకు మాసధ్రువము | 2 |
| ఫిబ్రవరు నెలలో కావలసిన తారీఖు | 18 |
| మొత్తము | 27 |

యీ మొత్తపు సంఖ్యయగు 27 ను 7 చేత భాగించగా శేషము 6 వచ్చినది. అనగా ఆదివారములగాయతు లెక్కించగా శుక్రవారము వచ్చినది. ఇది సరికాదు. పైన వ్రాసిన పద్ధతిప్రకారము లీపు సం॥రములలో జనవరి, ఫిబ్రవరి నెలలకు 1 తగ్గును గనుక 1932 వ సం॥రము లీపు సం॥రము గనుక యీ సం॥రములో ఫిబ్రవరి నెలకు 2 కు బదులుగా మాసధ్రువము 1 టి వేయవలెను. అట్లువేసి కలిపిన యెడల పై మొత్తము సంఖ్య 26 అగును. దానిని 7 చేత భాగించగా శేషము 5 వచ్చినది ఈసారి సరిగా గురువారము వచ్చినది. గనుక లీపు సం॥రములలో జనవరి, ఫిబ్రవరి నెలలకు మాత్రము మాసధ్రువమును సరి చూచుకొనవలెను.

లీపుసం॥ర మనగా యేసం॥రము నయినను 4 చేత భాగించగా శేషము రానియెడల అది లీపుసం॥రమనబడును. అనగా నాలుగుసంవత్సరముల కొకపర్యాయము లీపుసం॥రం వచ్చునని తెలుసుకొనవలెను.

3 వ ఉదాహరణము

1932 ఏప్రియల్ 7 వ తారీఖున వారమును గనుగొందము.

| | |
|---|---|
| 1900 లకు శతధ్రువము | 2 |
| 32 కు వర్షధ్రువము | 5 |
| ఏప్రియల్ నెలకు మాసధ్రువము | 5 |
| యీ నెలలో కోరిన తారీఖు | 7 |
| మొత్తము | 19 |

యీామొత్తపుసంఖ్యయగు 19 ని 7 చేత భాగించగా 5 శేషము వచ్చినది అనగా గురువారమని గ్రహించవలెను. యీాప్రకారము అన్ని సం॥రములకును తిథులను నక్షత్రములను గూడ గనుగొనవచ్చును.

### తిథి గనుగొను పద్ధతి

ఇంగ్లీషుసం॥రములో 1 కలిపి దానిని 19 చేత భాగించుము. మిగిలిన శేషమునుండి 1 తీసివేసి దానిని 11 చేత గుణించుము. ఆమొత్తములో యీాదిగువ కనబరచినప్రకారం మాసధ్రువమును ఆనెలయొక్క తారీఖును కలిపి దానిని 30 చేత భాగించుము. శేషమును శుద్ధపాడ్యమి మొదలుకొని లెక్కించగా తిథి సరిగా వచ్చును. ఈపద్ధతి 1800 సం॥రము లగాయతు 1900 సం॥రము ఆఖరు వరకూ సరిపోవును. 1901 సం॥రము మొదలుకొని పయిన వచ్చిన శేషములో 1 తీసివేయవలెను.

లీపుసం॥రములలో మార్చి నెల మొదలుకొని డిశంబరు నెలఆఖరువరకు మాసధ్రువములలో ప్రతినెలకు 1 టి తగ్గిపోవును.

### 1వ ఉదాహరణము.

1932 ఫిబ్రవరి 18వ తారీఖున తిథిని గనుగొందము. 1932 నకు 1టి కలుపగా 1933 అగును.

దీనిని 19చేత భాగించగా శేషము 14 వచ్చును. దీనిలో 1 తీసివేయగా 13వచ్చును. దీనిని 11చేత గుణించగా

143 అగును. దీనిలో ఫిబ్రవరి నెలకు మాసధ్రువము 2ను ఇంగ్లీషుతారీఖు 18 యును, చేర్చగా, 163 అగును. దీనిని 30చేత భాగించగా, శేషము 13 వచ్చును. దీనిలో 1 తీసివేయగా 12 వచ్చినది. అనగా ద్వాదశి తిథిఅయినది.

మా స ధ్రు వ ము లు .

కం. విను సున్న రెండు నొకటియు
నను పున మరిమూడు మూడు నైదును నైదున్
వెనుకను నేడును నెనిమిది
పనిగొనగా తొమ్మిదరయ పది పదకొండున్.

| | | | |
|---|---|---|---|
| జనవరి | 0 | జూలై | 5 |
| ఫిబ్రవరి | 2 | అగష్టు | 7 |
| మార్చి | 1 | సెప్టెంబరు | 8 |
| యేప్రియల్ | 3 | అక్టోబరు | 9 |
| మేయి | 3 | నవంబరు | 10 |
| జూన్ | 5 | డిశంబరు | 16 |

ఇంగ్లీషుతారీఖు రాత్రి 12 గంటలుమొదలుకొని ప్రారంభించును గనుక దానినను సరించి తిథిచూచుకొనవలయును. మిగిలిన నక్షత్రము మొదలగునవి యేరోజునక్కైనను చూచుకొనువిధము మాజ్యోతిషగ్రంథములయందు గనుగొనవలెను.



శ్రీరస్తు

# సాముద్రికదర్పణము



## మొదటిభాగము

### 1 ఆయుర్విషయము

1 ఎవనికి పూర్ణాయుర్దాయము పట్టును ?
2 ,, మధ్యాయుర్దాయము పట్టును ?
3 ,, అల్పాయుర్దాయము పట్టును ?
4 ,, బాలారిష్టము పట్టును ?
5 ,, బాలారిష్టము తప్పిపోవును ?

### 2 యోగవిషయము

6 ఎవడు మిక్కిలి అదృష్టవంతుడు ?
7 ,, ముద్రాధికారముగలవాడు ?
8 ,, గొప్పబిరుదాంకితముగలవాడు ?
9 ,, జమీందారు
10 ,, మహారాజు
11 ,, విశేషధనవంతుడు
12 ,, స్వల్పధనవంతుడు
13 ,, గొప్పభూజాతకుడు
14 ,, స్వల్పభూజాతకుడు

15 ,, స్వార్జితధనముగలవాడు

16 ,, పిత్రార్జితధనముగలవాడు

17 ఎవనికి వారసత్వపు ఆస్తి కలియును

13 ,, కళత్రమువల్ల ఆస్తి కలియును

19 ,, మాతామహార్జితము కలియును

20 ,, సోదరులవల్ల ఆస్తి కలియును

21 ,, తనకు సంబంధములేని చరాస్తి కలియును

22 ,, లాటరీవలన ధనము లభించును

23 ,, నిక్షేపము( పాతు) దొరకును

24 ,, దత్తతవల్ల ఆస్తి కలియును

25 ,, జూదమువల్ల ధనలాభము

26 ,, వాణిజ్యమువల్ల ఆస్తి కలియును

27 ,, వర్తకమువలన ధనలాభము కలుగును

28 ,, వ్యవసాయమువలన ధనలాభము

29 ,, ఉద్యోగమువలన ధనలాభము

30 ,, యితరవృత్తివలన ధనలాభము

3 కళత్రవిషయము

31 ఎవనికి ఏకకళత్రము

32 ,, ద్వికళత్రము పట్టును

33 ,, 3, 4 కళత్రములు పట్టును

34 ,, కళత్రము ముందుగా పోవును

35 ,, రోగకళత్రము లభించును

36 ,, భార్యతో విరోధము గలుగును
37 ఎవడు భార్యను విడచిపెట్టును
38 ,, భార్యతో యిష్టముగా నుండును
39 ,, భార్యకు లొంగియుండును
40 ఎవనికి తెలివైన భార్య లభించును
41 ,, పతివ్రత లభించును
42 ,, దుర్మార్గురాలు లభించును
43 ఎవడు జారుడగును
44 ,, బ్రహ్మచారి యగును

4 సంతానవిషయము

45 ఎవనికి విశేష సంతానముండును
46 ,, స్వల్పసంతాన ముండును
47 ,, సంతాననష్టము గలుగును
48 ,, సంతాన ముండదు
49 ఎవడు పెంచుకొనును
50 ,, దత్తుడగును

5 వ్యయము, ఖర్చు

51 ఎవనికి వ్యాజ్యములవలన ఖర్చుయగును
52 ,, వ్యభిచారమువలన ఖర్చుయగును
53 ,, వర్తకమువలన నష్టముకలుగును
54 ,, వ్యవసాయమువలన నష్టముగలుగును
55 ,, జూదమువలన నష్టముగలుగును
56 ,, త్రాగుడువలన నష్టముగలుగును

57 ఎవడు గొప్పకొరకు దూబా మొదలగు ఖర్చుచేయును
58 ,, ఋణముక్రింద భూమి ఖర్చుపెట్టును
59 ఎవనికి ఋణము చాలావుండును
60 ఎవడు ఋణవిముక్తుడగును
61 ,, రోగశరీరముగలవాడు
62 ,, నిరోగియగును
63 ,, సన్మార్గుడు
64 ,, దుర్మార్గుడు
65 ,, గొప్పదాతయగును
66 ,, పండితుడగును
67 ,, భక్తుడగును
68 ,, మూర్ఖుడగును
69 ,, దరిద్రుడు
70 ,, దివాలాతీయును
71 ,, కష్టజీవి
72 ,, సుఖజీవియగును

ఈ గ్రంథము అనేక సాముద్రికగ్రంథములు పరిశీలించి సర్వజనులకు దెలియునటుల వచనపూర్వకముగా ప్రతిప్రశ్నకు సరియైన కారణములు వ్రాయుచు ఆయా ప్రశ్నలకు తగిన రేఖలను గనబరచెడు అరచేతి పటములనుగూడ చక్కగా వ్రాయబడినది. యిట్టి గ్రంథము తెలుగుభాషతో యిదివరకు అచ్చుపడలేదు. ఇది వి. పి. ఖర్చులతో రు 2–5–0 అగును.

గ్రంథకర్త
ఆకెళ్ల వేంకటశాస్త్రి

# కృష్ణదండకము.

శ్రీదేవకీ దేవిబాలా, మహాశీలజాలా, సదానంద
లోలా, యశశ్శ్రీవిశాలా, విపద్ఘోరపాపాటవీవహ్ని కీలా, కుచే
లాంబరీషాది సద్భక్త చిత్తాలవాలా, సదారుక్మిణీ సత్యభా
మాది సీమంతినీ చిత్తలోలా, దయాపుణ్యశాలా, హరిద్రాభ
చేలా, సువర్ణాభ రద్భవర్లోకపాలా, భవత్పాద పంకేరుహాధ్యాన
సద్భక్త సంత్రాణశీలా, కృపాలా, సురారాతిగర్వాచలో
న్మూలా, గోపాల్పాకీపాల, శ్రీవేణుగోపాలబాలా, చతుర్బాహు
యుక్తుండవై, నీరదశ్యామవర్ణుండవై, పీత కౌశేయవాసుండవై
కోటికందర్పతుల్య ప్రభాదివ్యదేహుండవై, కౌస్తుభాలంక్రి
యాయుక్తకంఠుండవై, రుక్మిణీచారు శ్రీవత్సవక్షుండువై, దివ్య
రాకాశశాంకాంచితాస్యుండవై, వజ్రవైడూర్య మాణిక్య
భాస్వత్కిరీటుండవై, భూరికౌమోదకీశంఖ చక్రాబ్జహస్తుం
డవై, స్వర్ణవర్ణోపమాన ప్రభాకుండలీయుక్తకర్ణుండవై, పద్మ
పత్రాయతాక్షుండవై, మంజురాజీవనాభుండవై, గంధ
వాహాశన శ్రేష్ఠతల్పుండవై, గంధవాహాశనధ్వంస
యానుండవై, యున్న నీదివ్యరూపంబు నాయొక్క శక్తిన్ని
యోగించి, మిమ్మిట్లువర్ణించి, మీకై నమస్కారముల్
కోటి యర్పింతునేగాని పూర్ణంబుగా మిమ్మువర్ణింప పూజిం
ప, ధ్యానింప, వీక్షింప, సేవింప, కాంక్షింప, నేనెంత

వాడన్ హృషీకేశ యీశా, రమాధీశ, పూర్వంబు నన్నీవు మత్స్యావతారంబునన్వేధ నిద్రింపగా, వేదముల్ గొన్న యాసోమకు న్మొత్తవే, యెత్తవే మంధరాద్రిన్ పయోరాశి జిల్కంగ కూర్మావతారంబునం, గోరపండ్లన్ వరాహావతారం బునం దాహిరణ్యాక్షునిం ద్రుంపవే, వానియన్నన్నృసింహావ తారంబున న్వానివక్షంబు వేవ్రక్కలౌనట్లుగాజీల్చి చెండా డవే, నీవు ఖర్వావతారంబున న్మూడుపాదంబులేభూమి యిమ్మంచు వైరోచనున్వేడి బ్రహ్మాండమున్నిండగా, దేహ మున్పెంచి, యావజ్జిసామ్రాజ్యమున్ వానియాధీనముం జేయవే, దీర్ఘకోపంబుచేతం గుఠారంబుచేపట్టి రాముండవై నీవు ముయ్యేడుమారుల్ధరాధీశవంశంబు నిర్మూలముంజేయవే, నాడు కౌసల్యగర్భంబునంబుట్టి శ్రీరామచంద్రుండవై కాం తతో దండకారణ్యమే తేర గూఢంబుగా నకిం బంక్తికం ఠుండు గొంపోవగా నాంజనేయాది శాఖామృగానేక సాహా య్యముంగల్గి యాపాపశీలున్విదారింపవే, పిమ్మటం గామపా లుండవై చాయశీరంబుచేబట్టి యాహస్తినాపట్టణంబు న్మహా సూర్యజాగ్రహాదినిం ద్రోయగా బూనవే, వేగబుద్ధావతారం బున న్నీవెయశ్వత్థవృక్షంబులోనం బ్రవేశించి, యాబాతుస స్త్రీల మర్మంబులం దేటతెల్లంబుగాజేసి యాస్త్రీలనోముల్ పృథానేయవే, ముందు నీవీప్రపంచంబునందున్న దుర్మార్గు లంబట్టి సాధింప సత్కల్కిరూపంబుతో నుద్భవంబొందగా బూనవే, నీరదశ్యామ లోకాభిరామాపరంధామ యీమూర్త్య

జన్మంబుకంటె న్విశేషంబుగా బాపసంయుక్తమైనట్టి కీటాది జన్మంబులం దెన్నిటం దొల్లిటంబుట్టి, యేయేమహాబాధలం బొంది నేనుంటినో, గాని, నాపూర్వపుణ్యంబునం గ్రమ్మర న్నేటి కీమర్త్యజన్మంబునం బుట్టియున్ బుద్ధిలేకుండ, మీయొక్క మాయాప్రపంచంబునందున్న యీపాడు సంసారమే నమ్మి, పత్నీసుతభ్రాతృపిత్రాదులందుండు మోహంబునం జేసి, కామాది షట్శత్రుసందోహబంధుండనై, యింద్రియంబు ల్జయింపంగ సామర్థ్యమున్ లేక, యాశాపిశాచంబు బాధింపగా, నేటికే ఘోరపాపంబులం బెక్కులం జేసితిం, గృష్ణ కృష్ణా, మహాపాపినై నట్టి నన్నింక నాయంతమం దంతకుం డెంతబాధించి, యేయేమహానీచజన్మంబులం ద్రోయునో, వాసుదేవా మహాదేవ నన్గావ నీవేకదా దిక్కు, నాపూర్వపుణ్యంబున న్నీదుకారుణ్యమూలంబున న్నిన్నికన్నాదు చిత్తంబునందున్, హరేబాలకృష్ణా, హరేముద్దుకృష్ణా, హరేరామకృష్ణా, హరేకృష్ణ కృష్ణాయటంచు న్సదాయింకధ్యానింపగా నేటికీబుద్ధి నాకుద్భవించెం గనీసంబుగా గాన, నారాయణా, భక్తసంత్రాణపారాయణా, యట్టి నాబుద్ధి ముందైన యీపాడుసంసారతాపత్రయంబందు బోనీక, నాయొక్క జన్మావసానంబుపర్యంతము న్నీపదాంభోజయుగ్మంబునం దే, సదానిల్చియుండంగ గాపాడి రక్షింపవే, యట్లు రక్షించుచు న్మందికన్నాకు జన్మంబులేకుండ, యీమర్త్యజన్మావసానంబునందే భవత్పాదకంజాత సామీప్యమున్ జేర్పవే, యట్లు

యీమర్త్యజన్మాంతమందైన తొల్లింటి నాభాగ్యలోపంబుచే
మిమ్ముసేరంగ నర్హుండగాకుండిన న్నేనుముందింక, నేజన్మ
ముం బొందిన న్నీవు నాపై గృపంజూపి, యాజన్మమందే
భవత్పాదపంకేరుహధ్యానపారీణుగా మాత్రముంజేసి కాపాడి
రక్షింపవే, యట్లు రక్షించి నీకై సమర్పించియున్నట్టి యీ
దండకం బెవ్వరేగాని సద్భక్తితో వ్రాతురో, విందురో
కందురో చింతనంజేతురో వారలంగూడ నీదివ్యపాదాబ
సాన్నిధ్యముం జేర్పవే, వేగ గోపాలపురిగ్రామవాస్తవ్య
శ్రీ వేంకటజ్యోతిషజ్ఞ ప్రపోషా, యశశ్శ్రీవిశేషా, వసిష్ఠాప
గాతీరవాసా, సితాంభోజనేత్రా, లసద్దివ్యగాత్రా, మునిస్తోత్ర
పాత్రా, నమస్తే నమస్తే నమస్తే నమః.



# ఆంధ్రజ్యోతిషాలయం



## అత్యద్భుత జాతక ఫలములు.

1. మీ జాతకచక్రముయొక్క నకలుగాని, 2. పుట్టిన తేది తిథి వారము జననకాలఘడియలు లేక ఘంటలుగాని, రెండింటిలో నేవియో యొకటి మాకు పంపినయెడల—

1. జాతకుని రూపము, 2. స్వభావము, 3. శరీరదారుఢ్యము, 4. ధనసంపాదన, 5. సోదరసోదరీ వృద్ధి, 6. మాతృసౌఖ్యము, 7. విద్య, 8. భూమి, 9. వాహనము, 10. సంతానము, 11. శత్రువులు, 12. రోగము, 13 ఋణము, 14. కళత్రము, 15. కళత్రముయొక్క ఆయుర్దాయము, 16. భార్యాభర్తల అన్యోన్యము, 17. ద్వికళత్రయోగము, 18. జాతకుని ఆయుర్దాయము, 19. పితృసౌఖ్యము, 20. భాగ్యము, 21. ఉద్యోగము, జీవనము, 22. లాభము. 23. వ్యయము, 24. వర్తమానఫలము, ఈ 24 సంగతులు వ్రాసి 2-4-0 లకు వి. పి. గా పంపబడును. ఇవి నచ్చినయెడల అష్టకవర్గు షడ్వర్గు వర్గైరాలు కట్టి ద్వాదశభావములు మహాదశాంతర్దశాఫలములు ప్రమాణశ్లోకములతో ఆయుర్దాయము ఆఖరువరకు పూర్తిగజాతకము వ్రాయబడును. రు 10-0-0 లు అగును రు 4-0-0 లు ముందు అడ్వాన్సుగా పంపవలెను. మిగత సొమ్ముకు వి. పి. గా పంపబడును.

---

బాకళ్ల వెంకటశాస్త్రి, గోపాలపురం, కొత్తపేటపోష్టు. తూ॥ గో॥

## జ్యోతిష గ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | జ్యోతిష ప్రథమబోధిని | 0—8—0 |
| 2 | జాతకమార్తాండము 1 వ భాగం | 1—8—0 |
| | డిటో 2 వ భాగం | 1—8—0 |
| | డిటో 3 వ భాగం | 1—8—0 |
| 3 | ఆంధ్రజాతక తత్వసూత్రములు 1 వ భాగం | 1—8—0 |
| | రెండవ భాగం | 1—8—0 |
| 4 | బృహత్పారాశరసంహిత | 0—8—0 |
| 5 | గర్గసంహిత | 0—4—0 |

## జ్యోతిష విద్యా ప్రకాశిక

| | |
|---|---|
| 1 వ భాగం సంజ్ఞాధ్యాయం | 1—0—0 |
| 2 వ భాగం గణితాధ్యాయం | 2—0—0 |
| 3 వ భాగం భావఫలధ్యాయం | 3—0—0 |
| 4 వ భాగం దశాఫలాధ్యాయం | 2—0—0 |

యివియే జ్యోతిషకళాపాఠశాల పుస్తకములు

యివి 7 భాగములు. మా జ్యోతిషకళాపాఠశాలలో జేరి జ్యోతిషము నేర్చుకొను ప్రతిపాఠమునకు పోష్టుద్వారా పంపి జ్యోతిషము నేర్పెదము. మాపాఠశాలలో ఎపుడు చేరినను చేరవచ్చును. నెల 1 కి రు 2—0—0 అగును. యింకను కావలసినయెడల వివరములు వ్రాసి తెలిసికొనుడు. పోష్టు ఖర్చులు కొనువారే భరింపవలెను.

ఆకెళ్ల వేంకటశాస్త్రి, గోపాలపురం

కొత్తపేటపోష్టు, తూర్పుగోదావరిజిల్లా.

కం. ఏరీతినైన నోరులకు
నోరంతయు నుపకరించు గుణియగునతడున్
నోరెఱుగని పశువులు మన
కేరీతిగ పాలొసంగు నెఱుగవె సుగుణా. 54

కం. తొలిజేసిన ప్రారబ్ధం
బిలలో తాననుభవించు నెవ్వండైనన్
తలక్రిందుపక్షి యట్టుల
తలక్రిందుగ నుండ నేమి తెలపవె సుగుణా. 56

కం. ఇతరుల జెరుప దలంచిన
నతడే చెడిపోవు పిదప నదియెట్లన్నన్
సతియగుసీతను రావణు
డతివలపున దెచ్చి నాశ మందడె సుగుణా. 56

కం. ఎన్నికగను పండితుడై
యున్నను శీలంబులేక యొప్పునె యతడున్
కన్నులు గానని వానికి
నున్నని యద్దంబదేల నుడువవె సుగుణా. 57

కం. చేరువ నున్నను కుజనుం
డారయలే డొరులగుణము నజ్ఞానమునన్
చేరువ నున్నను కప్పలు
సారసరస మానలేని చందము సుగుణా. 58

కం. తనకుగల దానితోడనె
తనివిగ జీవించువాడె ధన్యుడు సుమ్మీ
వననిధి దిరిగెడు మీనము
వనమున నే బ్రతుకునట్టి వడువున సుగుణా. 59

కం. తనబుద్ధియె సుఖమిచ్చును
యినుమడిగా గురునిబుద్ధి యిచ్చుసుఖంబున్
తనకంతము పరబుద్ధియె
వనజాక్షులబుద్ధి యెపుడు ప్రళయము సుగుణా. 60

కం. పరిశీలించిన కొలదిని
పరమాత్మను తెలిసికొనగ వశమగు కడకున్
తరచినకొలదిని పెరుగును
సరసంబగు వెన్న దొరకు చందము సుగుణా. 61

కం. ఒరులకు నపకృతి లేకయె
సరసంబుగ ధనముగూర్చు సజ్జను డెప్పుడున్
విరులకు నష్టము లేకయె
సరఘులు సమకూర్చు తేనె చందము సుగుణా. 62

కం. ఎఱుగక చేసియు పురుషుడు
దురితఫలం బనుభవించు తోడనె యతడున్
ఎఱుగక ననలము ముట్టిన
చిఱుతను నది కాల్పకున్నె చిత్రము సుగుణా. 63

కం. అలసుడు ఘనునిం జేరిన
చెలువున తా ఘనతజెందు చిత్రముగాగన్
అలరుల జేరుచు దారము
వెలదుల కంఠంబునందు వెలయదె సుగుణా. 64

కం. ఘనుడే యల్పుని జేరిన
తనఘనతకు లోటురాక తప్పదుసుమ్మీ
వనమున తెప్పను తేలదె
ఘనముగ నున్నట్టిరాతి కంబము సుగుణా. 65

కం. ఖలుడే ఖలులను జేరును
కలనైనను సాధు జేరి గానడుసుమ్మీ
మలమును దినియెడు పురుగులు
మలయజమున కెట్లుజేరు మహిలో సుగుణా. 66

కం. బలముగలవాడు శాంతము
గలవాడై యున్నయెడల గణ్యతజెందున్
పలుశాఖలొనగు తనయుల
పలువిధముల సైచు తల్లి వడువున సుగుణా. 67

కం. మితిమీరి యాసగొనియెడు
ప్రతిమనుజుడు తప్పకుండ భంగముజెందున్
అతియాస నెఱకు బోయెడు
ప్రతిమీనము మృతిని జెందు వడువున సుగుణా. 68

కం. చెనటులు సంపాదించిన
ధనమంతయు నొక్కసారె తఱుగును సుమ్మీ
ఘనముగ బెరిగెడు వృక్షము
పెనుగాలిని కూలునట్టి విధమున సుగుణా. 69

కం. పొలుపగు సతి తనకున్నను
కలుషాత్ముడై కోరు నితర కాంతల నెపుడున్
పలుదెఱగుల నీరుండియు
బలిపుష్టము కడవజేరు చందము సుగుణా. 70

కం. కవిలేని సభలవెల్లను
రవిలేని నభంబు మాడ్కి రాజిల్లవునీ
చవిలేని కూరలెల్లను
భువిలో నవి యెట్లు పొసగు భుక్తికి సుగుణా. 71

కం. అరయ మహాత్ముల యశమది
దురితాత్ముల చెలిమివలన దొలగదు సుమ్మీ
ఉరగావృతమగు చందన
తరువునకుం బరిమళంబు తలగునె సుగుణా. 72

కం. కవనము సంగీతంబును
భువిలో నివి లభ్యమగుట పుణ్యముగాదే
యివిగొని బ్రహ్మానందము
చెవిగొనలేనట్టివాడు జడుడగు సుగుణా. 73

కం. నిరుపేదయు మూర్ఖుండును
పరవాసియు నిత్యరోగి పరసేవకుడున్
నిరతము బ్రతుకుట కన్నను
మరణంబే శ్రేయమండ్రు మాన్యులు సుగుణా. 74

కం. దినములు వ్యర్థము సేయక
దినమునకొక నిమిషమైన దేవుని మదిలో
పనివడి గొలువని మనుజుడు
మనుజుండే పశువుగాని మహిలో సుగుణా. 75

కం. దేహాభిమాన ముండగ
మోహంబును విడువగలడె మూర్ఖుండెప్పుడున్
సాహసమున నదివిడిచిన
బాహాటముగాను జెందు పరమును సుగుణా. 76

కం. ధనమును మనసును రెండును
చేనువుగ నున్నంతవరకు సౌఖ్యము లేదె
యనుచిత ముచితము నెఱుగని
మనుజునకవి యేలవిడును మహిలో సుగుణా. 77

కం. ప్రథమమున తత్వచింతయు
ప్రథితంబగు శాస్త్రచింత పదపడి వెలయున్
అధమమగు దానచింతయు
నధమాధమమగును తీర్థయాత్రలు సుగుణా. 78

కం. పరహితుడే యుత్తముడగు
యిరుదెసలను మధ్యముండు హితుడై యొప్పన్
పరవైరియె యధముండగు
నిరుదెసలకు వైరి యెట్టి హీనుడొ సుగుణా. 79

కం. కుజనుడు చెప్పియు చేయడు
సుజనుం డటుచెప్పకుండ సొంపుగ జేయున్
ప్రజలకు నుండెడు గుణముల
నిజమును గనుగొనుటకిదియె నీతిర సుగుణా. 80

కం. తనకుపకార మొనర్చెడు
జనునకె కడుకీడుజేయ జేసబోయెడు న
చ్చనటికి ఘనమై యొప్పాచు
శునకము పదిరెట్లు మేలు జూపును సుగుణా. 81

కం. దయలేని యాగమేలను
దయలేకను దానమేల ధర్మంబేలా
దయలేని రాజ్యమేలను
దయమాలినబ్రతుకదేల తలపగ సుగుణా. 82

కం. •ఎయ్యది ముక్తికి తెరువగు
• నెయ్యది సుగుణంబులందు హెచ్చును ఘనమై
ఎయ్యది భక్తికి మొదలగు
నయ్యదియే నీతియంద్రు నవనిని సుగుణా. 83

కం. పొడచిన తిట్టిన కొట్టిన
పడియూరకయుండుగాని ప్రాజ్ఞుడు మఱితా
నొడబడడు మారు సేయఁగ
విడువడు ధర్మంబు నెప్పుడు వినరా సుగుణా. 84

కం. చంచలమగు సంసారము
చంచలములు జీవనంబు జవరాండ్రు సుతుల్
చంచలమగు సిరియు ప్రాణము
చంచలనము లేని దొక్కసత్యమె సుగుణా. 85

కం. వేడుచు నెంతఁగ జెప్పిన
వీడడు తన పాడుగుణము వెంగలియెప్పుడున్
గాడిదకు గంధమలదిన
బూడిదలో పొరలునట్టి పోలిక సుగుణా. 86

కం. బాలిశుని జేరనిచ్చిన
పాలకునే జెరుపజూచు పాపపుబుద్ధిన్
పాలొసగి యెంతపెంచిన
వ్యాళము తనుగఱవజూచు భంగిని సుగుణా. 87

కం. తెలివలు జాణతనంబున
నెఱుకను గలవారినైన నెరగొందురుమీ
తెరవాటుకాడు తెరువున
తెరువరులను గొట్టునట్టి తెఱగున సుగుణా. 88

కం. నీతిగ శ్రమపడి చేసెడు
చేతకు తగునట్టిఫలము చేకురు సుమ్మీ
నూతిని లోతుగ త్రవ్విన
పాతాళపుగంగ దొరకు భంగిని సుగుణా. 89

కం. కల్లకు కల్లయె బలమగు
పిల్లలకుం దల్లిమెప్పు పెద్ద బలంబౌ
నల్లికి స్నేహము బలమగు
నెల్లరకును నీతి బలము యెఱుగగ సుగుణా. 90

కం. జూదము నాడిన యెడలను
ఖేదంబును జెందెదీవు కీనాశుడవై
మేదినికెల్లను ప్రభువయి
జూదంబున నలుడు చెడడె చొరబడి సుగుణా. 91

కం. సత్యము తప్పకయుండిన
నిత్యము కడుమేలుగలుగు నిజముగ నీకున్
సత్యము విడువని కతమున
సత్యహరిశ్చంద్రుడయ్యె జగతిని సుగుణా. 92

కం. ప్రాకున ననలముభంగిని
నాకసమున గాలిభంగి నందఱిలోనన్
డీకొని దేవుండుండగ
చేకొనలేకుంకి జూడ జిత్రము సుగుణా. 93

కం. హరికథలు వినెడువారికి
హరిపూజలు చేయువారి కనవరతంబున్
హరినే నమ్మినవారికి
హరియే సమకూర్చునెపుడు నఖిలము సుగుణా. 94

కం. కనుమూసి యరసి జూచిన
గనవచ్చును జగతిలోని కల్ల నిజంబుల్
కనుదెరచి దీసి నిజేమును
ఘనుడైనను గానలేడు గదరా సుగుణా. 95

కం. భక్తిని సేవించినయెడ
ముక్తిని దా జెందగలడు మూర్ఖుండైనన్
శక్తికి జాలని వుడుతయె
భక్తిని సేవించి బొందె పరమది సుగుణా. 96

కం. వెలయును జంద్రుడు రాత్రిని
వెలయును సూర్యుండు పగలు విశ్వములోనన్
వెలయు సుపుత్రుడు కులమున
వెలయును ధర్మంబు నెల్లవేళల సుగుణా. 97

కం. అరయగ లుబ్ధుం డెప్పుడును
సిరి యుండియు సుఖము తాను జెందడు సుమీ
తఱచుగ చేనికి గట్టెడు
వెఱబొమ్మను బోలునట్టి విధమున సుగుణా. 98

కం. ఎనుబదినాలుగులక్షల
జననంబులు దాటియుండి చయ్యన నిపుడీ
మనుజుండై జన్మించియు
వినియోగము లేనివాడు వృథరా సుగుణా. 99

కం. బుద్ధికి మనసే విషము గు
బద్ధకునకు భోజనంబు బహు విషమంబౌ
వృద్ధునకు తరుణి విషముగు
నిద్దరనందఱికి విషము ఋణముగు సుగుణా. 100

కం. పొరపాటనునది నిజేముగ
పొరపాటున వచ్చుచుండు బుధునకు నైనన్
పొరపాటెన్నుట కన్నను
పొరపాటికలేదు మనకు పుడమిని సుగుణా. 101

కం. తప్పులు గనబడుచున్నను
యొప్పులనే సంగ్రహించు నొప్పుగ బుధుడున్
నెప్పున నీరును విడుచుచు
తెప్పున పాల్గ్రోగుహంస తెఱగున సుగుణా. 102

కం. ఆకెళ్ల వంశమందున
ప్రాకటముగ జననమంది పద్యశతంబున్
జేకొని వేంకటశాస్త్రియె
శ్రీకాంతుని కరుణవలన జేసెను సుగుణా. 103

కం. ఏర్పైన సుగుణశతకము
నే పామరుడైన విన్న నేర్పడి చదువన్
గోపాలపురాధీశుడు
గోపాలకృష్ణు డిచ్చు కోర్కెలు సుగుణా. 104

కం. మంగళమగు భూపతులకు
మంగళమగు సతులకెపుడు మాన్యులకెల్లన్
మంగళమగు గోసమితికి
మంగళమగు రామచంద్ర మహిమను సుగుణా. 105

—సంపూర్ణము—



## ఇంగ్లీషు తేదీలకు వారములను కనుగొనుట.

ఇంగ్లీషు సంll రములలో నేసంll రములలో నైనను ఏ నె లలో నైనను ఏ తారీఖునకైనను ఆనాటివారమును సులభముగా తెలిసికొనవచ్చును.

కం. శతవర్ష మాస ధృవముల
ప్రతి తేదియు గలుపుచుండి పర్యతసంఖ్యన్
ప్రతివారును విభజించిన
ప్రతి శేషము వారమగును వారపువరుసన్.

అనగా శతధృవము, వర్షధృవము, మాసధృవము, ఇవిమూడును కలిపి ఆ మొత్తములో మీరుకోరిన ఇంగ్లీషు తారీఖును కలిపి యామొత్తమును 7చేత భాగించినయెడల కొంత శేషము వచ్చును. ఆ శేషసంఖ్యను ఆదివారము మొదలుగా లెక్కించినయెడల సరిగా మీరుకోరినవారము వచ్చును. శేషము రానియెడల శనివారము అని తెలుసుకొనవలెను.

### శ త ధ్రు వ ము.

1800 సంll మొదలుకొని 1899 సంllరం ఆఖరువరకు 4 శతధ్రువమగును.

1900 సంllరం మొదలుకొని 1999 సంllరం.ఆఖరువరకు 2 శతధ్రువమగును.

### వ ర్ష ధ్రు వ ము.

కం. నాలుగుచేతను నబ్దము
పాలుంగొన వచ్చు న వ్విభక్తముదానిన్
మేలున గలుపుచు యేడున
పాలుంగొన మిగులునదియె వర్షధ్రువమా.

ఏసం॥ రమునకు వర్ష ధ్రువము గనుగొనవలెనో దానిని 4 చేత భాగించి ఆవిభక్తమును ఆసం॥రసంఖ్యలోనే కలిపి ఆమొత్తమును 7 చేత భాగించగా మిగిలిన శేషము వర్ష ధ్రువమగును.

వర్షధ్రువమున కుదాహరణము. 31, 32, సం॥రములకు వ్రాయుచున్నాము.

31ని 4 చేత భాగించగా 7 విభక్తమువచ్చును ఈవిభక్తమగు 7ను 31లో కలపగా 38 అయ్యెను. దీనిని 7చేత భాగించగా శేషము 3 వచ్చినది యిదియే వర్ష ధ్రువము. 32ను 4చేత భాగించగా 8 విభక్తమువచ్చును. ఈవిభక్తమగు 8ని 32లో కలపగా 40 అయ్యెను. దీనిని 7చేత భాగించగా శేషము 5 వచ్చినది యిదియే వర్ష ధ్రువము. అనగా 31వసం॥రమునకు 3ను 32వసం॥రమునకు 5ను వర్ష ధ్రువములగును అని మనకు తెలియుచున్నది

మా స ధ్రు వ ము.

కం. ఆఱును రెండును రెండును
సారసముగ నైదు నేడు జనునట మూడున్
జేరువనైదును నొకటియు
ఆరయ నా ల్గారు రెండు నటుపై నాల్గున్.

| | | | |
|---|---|---|---|
| జనవరి | 6 | జూలై | 5 |
| ఫిబ్రవరి | 2 | ఆగష్టు | 1 |
| మార్చి | 2 | సెప్టెంబరు | 4 |
| యేప్రియలు | 5 | అక్టోబరు | 6 |
| మేయి | 7 | నవంబరు | 2 |
| జూన్ | 3 | డిశంబరు | |

ఈపైన ఉదాహరించినప్రకారం ప్రతినెలకు మాసధ్రువములు కలుపుకొనవలెను. గాని,

లీపు సం॥రమున ఫిబ్రవరునెలకు 1టియు జనవరినెలకు 5ను మాసధ్రువములగును. అనగా లీపుసం॥రములలో జనవరి ఫిబ్రవరునెలలకు పై మాసధ్రువములలో 1సంఖ్య తగ్గును.

1 ఉ దా హ ర ణ ము.

1931 సం॥ డిశంబరు 30 తారీఖున వారమును గనుగొందము.

| | |
|---|---|
| 1900 సం॥రమునకు శతధ్రువము | 2 |
| 31 వ సం॥రమునకు వర్షధ్రువము | 3 |
| డిశంబరునెలకు మాసధ్రువము | 4 |
| డిశంబరునెలలో కోరిన తారీఖు | 30 |
| మొత్తము | 39 |

యీమొత్తపు సంఖ్యయగు 39ని 7 చేత భాగింపగా 4 శేషమువచ్చినది. యీ 4 ను ఆదివారములగాయితు వరుసగా లెక్కింపగా బుధవారమయినది.

అనగా 1931 డిశంబరు 30 తారీఖున యేవారమయినదో యీమీా పంచాంగములను డైరీని చూచుకొనుడు.

2 ఉదాహరణము.

1932 ఫిబ్రవరినెల 18 వ తారీఖున వారమునుగనుగొందము.

| | |
|---|---|
| 1900 సం॥రమునకు శతధ్రువము | 2 |
| 32 సం॥రమునకు వర్షధ్రువము | 5 |
| ఫిబ్రవరునెలకు మాసధ్రువము | 2 |
| ఫిబ్రవరునెలలో కావలసిన తారీఖు | 18 |
| మొత్తము | 27 |

యీ మొత్తపు సంఖ్యయగు 27 ను 7 చేత భాగించగా శేషము 6 వచ్చినది. అనగా ఆదివారములగాయతు లెక్కించగా శుక్రవారము వచ్చినది. ఇది సరికాదు. పైన వ్రాసిన పద్ధతిప్రకారము లీపు సం॥రములలో జనవరి, ఫిబ్రవరి నెలలకు 1 తగ్గును గనుక 1932 వ సం॥రము లీపు సం॥రము గనుక యీ సం॥రములో ఫిబ్రవరి నెలకు 2 కు బదులుగా మాసధ్రువము 1 టి వేయవలెను. అట్లువేసి కలిపిన యెడల పై మొత్తము సంఖ్య 26 అగును. దానిని 7 చేత భాగించగా శేషము 5 వచ్చినది ఈసారి సరిగా గురువారము వచ్చినది. గనుక లీపు సం॥రములలో జనవరి, ఫిబ్రవరి నెలలకు మాత్రము మాసధ్రువమును సరి చూచుకొనవలెను.

లీపుసం॥ర మనగా యేసం॥రము నయినను 4 చేత భాగించగా శేషమురాని యెడల అది లీపుసం॥రమనబడును. అనగా నాలుగుసంవత్సరముల కొకపర్యాయము లీపుసం॥రం వచ్చునని తెలుసుకొనవలెను.

3 వ ఉదాహరణము

1932 ఏప్రియల్ 7 వ తారీఖున వారమును గనుగొందము.

| | |
|---|---|
| 1900 లకు శతధ్రువము | 2 |
| 32 కు వర్షధ్రువము | 5 |
| ఏప్రియల్ నెలకు మాసధ్రువము | 5 |
| యీనెలలో కోరిన తారీఖు | 7 |
| మొత్తము | 19 |

యీమొత్తపుసంఖ్యయగు 19 ని 7 చేత భాగించగా 5 శేషము వచ్చినది అనగా గురువారమని గ్రహించవలెను. యీప్రకారము అన్ని సం॥రములకును తిధులను నక్షత్రములను గూడ గనుగొనవచ్చును.

తిధి గనుగొను పద్ధతి

ఇంగ్లీషుసం॥రములో 1 కలిపి దానిని 19 చేత భాగించుము. మిగిలిన శేషమునుండి 1 తీసివేసి దానిని 11 చేత గుణించుము. ఆమొత్తములో యీదిగువ కనబరచినప్రకారం మాసధ్రువమును ఆనెలయొక్క తారీఖును కలిపి దానిని 30 చేత భాగించుము. శేషమును శుద్ధపాడ్యమి మొదలుకొని లెక్కించగా తిధి సరిగా వచ్చును. ఈపద్ధతి 1800 సం॥రములగాయతు 1900 సం॥రము ఆఖరు వరకూ సరిపోవును. 1901 సం॥రము మొదలుకొని పయిన వచ్చిన శేషములో 1 తీసివేయవలెను.

లీపుసం॥రములలో మార్చి నెల మొదలుకొని డిశంబరు నెలఆఖరువరకు మాసధ్రువములలో ప్రతినెలకు 1 టి తగ్గిపోవును.

1వ ఉ దా హ ర ణ ము.

1932 ఫిబ్రవరి 18వ తారీఖున తిధిని గనుగొందము. 1932 నకు 1టి కలుపగా 1933 అగును.

దీనిని 19చేత భాగించగా శేషము 14 వచ్చును. దీనిలో 1 తీసివేయగా 13వచ్చును. దీనిని 11చేత గుణించగా

143 అగును. దీనిలో ఫిబ్రవరి నెలకు మాసధ్రువము 2ను ఇంగ్లీషు తారీఖు 18 యును, చేర్చగా, 163 అగును. దీనిని 30చేత భాగించగా, శేషము 13 వచ్చును. దీనిలో 1 తీసివేయగా 12 వచ్చినది. అనగా ద్వాదశి తిథిఅయినది.

మా స ధ్రు వ ము లు .

కం. విను సున్న రెండు నొకటియు
నను‌వున మరిమూడు మూడు నైదును నైదున్
వెనుకను నేడును నెనిమిది
పనిగొనగా తొమ్మిదరయ పది పదకొండున్.

| | | | |
|---|---|---|---|
| జనవరి | 0 | జూలై | 5 |
| ఫిబ్రవరి | 2 | అగష్టు | 7 |
| మార్చి | 1 | సెప్టెంబరు | 8 |
| యేప్రియల్ | 3 | అక్టోబరు | 9 |
| మేయి | 3 | నవంబరు | 10 |
| జూన్ | 5 | డిశంబరు | 16 |

ఇంగ్లీషు తారీఖు రాత్రి 12 గంటలు మొదలుకొని ప్రారంభించును గనుక దానిననుసరించి తిథిచూచుకొనవలయును. మిగిలిన నక్షత్రము మొదలగునవి యేరోజునక్కైనను చూచుకొనువిధము మాజ్యోతిషగ్రంధములయందు గనుగొనవలెను.



శ్రీరస్తు

# సాముద్రికదర్పణము



## మొదటి భాగము

### 1 ఆయుర్విషయము

1 ఎవనికి పూర్ణాయుర్దాయము పట్టును ?

2 ,, మధ్యాయుర్దాయము పట్టును ?

3 ,, అల్పాయుర్దాయము పట్టును ?

4 ,, బాలారిష్టము పట్టును ?

5 ,, బాలారిష్టము తప్పిపోవును ?

### 2 యోగవిషయము

6 ఎవడు మిక్కిలి అదృష్టవంతుడు ?

7 ,, ముద్రాధికారముగలవాడు ?

8 ,, గొప్పబిరుదాంకితముగలవాడు ?

9 ,, జమీందారు

10 ,, మహారాజు

11 ,, విశేషధనవంతుడు

12 ,, స్వల్పధనవంతుడు

13 ,, గొప్పభూజాతకుడు

14 ,, స్వల్పభూజాతకుడు

15 ,, స్వార్జితధనముగలవాడు
16 ,, పిత్రార్జితధనముగలవాడు
17 ఎవనికి వారసత్వపు ఆస్తి కలియును
13 ,, కళత్రమువల్ల ఆస్తి కలియును
19 ,, మాతామహార్జితము కలియును
20 ,, సోదరులవల్ల ఆస్తి కలియును
21 ,, తనకు సంబంధములేని చరాస్తి కలియును
22 ,, లాటరీవలన ధనము లభించును
23 ,, నిక్షేపము( పాతు) దొరకును
24 ,, స్త్రీతవల్ల ఆస్తి కలియును
25 ,, జూదమువల్ల ధనలాభము
26 ,, వాణిజ్యమువల్ల ఆస్తి కలియును
27 ,, వర్తకమువలన ధనలాభము కలుగును
28 ,, వ్యవసాయమువలన ధనలాభము
29 ,, ఉద్యోగమువలన ధనలాభము
30 ,, యితరవృత్తివలన ధనలాభము

3 కళత్రవిషయము

31 ఎవనికి ఏకకళత్రము
32 ,, ద్వికళత్రము పట్టును
33 ,, 3, 4 కళత్రములు పట్టును
34 ,, కళత్రము ముందుగా పోవును
35 ,, రోగకళత్రము లభించును

36 ,, భార్యతో విరోధము గలుగును
37 ఎవడు భార్యను విడచిపెట్టును
38 ,, భార్యతో యిష్టముగా నుండును
39 ,, భార్యకు లొంగియుండును
40 ఎవనికి తెలివైన భార్య లభించును
41 ,, పతివ్రత లభించును
42 ,, దుర్మార్గురాలు లభించును
43 ఎవడు జారుడగును
44 ,, బ్రహ్మచారి యగును

4 సంతానవిషయము

45 ఎవనికి విశేష సంతానముండును
46 ,, స్వల్పసంతాన ముండును
47 ,, సంతాననష్టము గలుగును
48 ,, సంతాన ముండదు
49 ఎవడు పెంచుకొనును
50 ,, దత్తుడగును

5 వ్యయము, ఖర్చు

51 ఎవనికి వ్యాజ్యములవలన ఖర్చుయగును
52 ,, వ్యభిచారమువలన ఖర్చుయగును
53 ,, వర్తకమువలన నష్టముకలుగును
54 ,, వ్యవసాయమువలన నష్టముగలుగును
55 ,, జూదమువలన నష్టముగలుగును
56 ,, త్రాగుటవలన నష్టముగలుగును

57 ఎవడు గొప్పకొరకు దూబా మొదలగు ఖర్చుచేయును
58 ,, ఋణముక్రింద భూమి ఖర్చుపెట్టును
59 ఎవనికి ఋణము చాలావుండును
60 ఎవడు ఋణవిముక్తుడగును
61 ,, రోగశరీరముగలవాడు
62 ,, నిరోగియగును
63 ,, సన్మార్గుడు
64 ,, దుర్మార్గుడు
65 ,, గొప్పదాతయగును
66 ,, పండితుడగును
67 ,, భక్తుడగును
68 ,, మూర్ఖుడగును
69 ,, దరిద్రుడు
70 ,, దివాలాతీయును
71 ,, కష్టజీవి
72 ,, సుఖజీవియగును

ఈ గ్రంథము అనేక సాముద్రికగ్రంథములు పరిశీలించి సర్వజనులకు దెలియునటుల వచనపూర్వకముగా ప్రతిప్రశ్నకు సరియైన కారణములు వ్రాయుచు ఆయా ప్రశ్నలకు తగిన రేఖలను గనబరచెడు అరచేతి పటములనుగూడ చక్కగా వ్రాయబడినది. యిట్టి గ్రంథము తెలుగుభాషతో యిదివరకు అచ్చుపడలేదు. ఇది వి. పి. ఖర్చులతో రు 2—5—0 అగును.

గ్రంథకర్త
ఆకెళ్ల వేంకటశాస్త్రి

# కృష్ణదండకము.

శ్రీదేవకీ దేవిబాలా, మహాశీలజాలా, సదానంద లోలా, యశశ్శ్రీవిశాలా, విపద్ఘోర పాపాటవహ్ని కీలా, కుచేలాంబరీషాది సద్భక్త చిత్తాలవాలా, సదారుక్మిణీ సత్యభామాది సీమంతినీ చిత్తలోలా, దయాపుణ్యశాలా, హరిద్రాంభచేలా, సువర్ణాభరద్భావర్గ్గోకపాలా, భవత్పాద పంకేరుహాధ్యాన సద్భక్త సంత్రాణశీలా, కృపాలా, సురారాతిగర్వాచలోన్మూల, గోపాలపాలా, శ్రీవేణుగోపాలబాలా, చతుర్బాహుయుక్తుండవై, నీరదశ్యామవర్ణుండవై, పీత కౌశేయవాసుండవై కోటికందర్పతుల్య ప్రభాదివ్యదేహుండవై, కౌస్తుభాలంక్రియాయుక్తకంఠుండవై, రుక్మిణీచారు శ్రీవత్సవక్షుండవై, దివ్యరాకాశశాంకాంచితాస్యుండవై, వజ్రవైడూర్య మాణిక్యభాస్వత్కిరీటుండవై, భూరికౌమోదకీశంఖ చక్రాబ్జహస్తుండవై, స్వర్ణవర్ణోపమాన ప్రభాకుండలీయుక్తకర్ణుండవై, పద్మపత్రాయతాక్షుండవై, మంజురాజీవనాభుండవై, గంధవాహాశన శ్రేష్ఠతల్పుండవై, గంధవాహాశనధ్వంసయానుండవై, యున్న నీదివ్యరూపంబు నాయొక్క శక్తిన్ని యోగించి, మిమ్మిట్లువర్ణించి, మీకై నమస్కారముల్ కోటి యర్పింతునేగాని పూర్ణంబుగా మిమ్మువర్ణింప పూజింప, ధ్యానింప, వీక్షింప, సేవింప, కాంక్షింప, నేనెంత

వాడన్ హృషీకేశ యీశా, రమాధీశ, పూర్వంబు నన్నీవు మత్స్యావతారంబునన్వేధ నిద్రింపగా, వేదముల్ గొన్న యాసోమకున్ ద్రుంచి, మత్స్యావతారంబునన్వేద నిద్రింపగా, వేదముల్ గొన్న యాసోమకున్ మార్తువే, యెత్తవే మంధరాద్రిన్ పయోరాశి జిల్కంగ కూర్మావతారంబునం, గోరపండ్లన్ వరాహావతారం బునం దాహిరణ్యాక్షునిం ద్రుంపవే, వానియన్నన్నృసింహావ తారంబునన్వానివక్షంబు వ్రేళ్ళక్కలౌనట్లుగాజీల్చి చెండా డవే, నీవు ఖర్వావతారంబున న్మూడుపాదంబులే భూమి యిమ్మంచు వైరోచనున్వేడి బ్రహ్మాండమున్నిండగా, దేహ మున్పెంచి, యావద్ధరిత్రీసామ్రాజ్యమున్ వానియాధీనముం జేయవే, దీర్ఘకోపంబుచేతం గుఠారంబుచేపట్టి రాముండవై నీవు ముయ్యేడుమారుల్ధరాధీశవంశంబు నిర్మూలముం జేయవే, నాడు కౌసల్యాగర్భంబునంబుట్టి శ్రీరామచంద్రుండవై కాం తతో దండకారణ్యమే తేర గూఢంబుగా నకిం బంక్తికం ఠుండు గొంపోవగా నాంజనేయాది శాఖామృగానేక సాహా యముంగల్గి యాపాపశీలున్విదారింపవే, పిమ్మటం గామపా లుండవై చారుశీరంబుచేబట్టి యాహస్తినాపట్టణంబు న్మహా సూర్యజాగ్రహాదినిం ద్రోయగా బూనవే, వేగబుద్ధావతారం బున న్నీవెయశ్వత్థవృక్షంబులోనం బ్రవేశించి, యాంబాతుస స్త్రీల మర్మంబులం దేటతెల్లంబుగా జేసి యాస్త్రీలనోముల్ పృధానేయవే, ముందు నీవీప్రపంచంబునందున్న దుర్మార్గు లంబట్టి సాధింప సత్కల్కిరూపంబుతో నుద్భవంబొందగా బూనవే, నీరదశ్యామ లోకాభిరామాపరంధామ యీమూర్త్య

జన్మంబుకంటె నెక్కువేశేషంబుగా బాపసంయుక్తమైనట్టి కీటాది జన్మంబులం దెన్నిటం దొల్లిటంబుట్టి, యేయేమహాబాధలం బొంది నేనుంటినో, గాని, నాపూర్వపుణ్యంబునం గ్రమ్మర న్నేటి కీమర్త్యజన్మంబునం బుట్టియున్ బుద్ధిలేకుండ, మీ యొక్క మాయాప్రపంచంబునందున్న యీపాడు సంసారమే నమ్మి, పత్నీసుతభ్రాతృపిత్రాదులందుండు మోహంబునం జేసి, కామాది షట్చత్రుసందోహబంధుండనై, యింద్రియంబులయింపంగ సామర్థ్యమున్ లేక, యాశాపిశాచంబు బాధింపగా, నేటికే ఘోరపాపంబులం బెక్కులం జేసితిం, గృష్ణ కృష్ణా, మహాపాపినైనట్టి నన్నింక నాయంతమం దంతకుం డెంత బాధించి, యేయేమహానీచజన్మంబులం ద్రోయునో, వాసుదేవా మహాదేవ నన్ గావ నీవేకదా దిక్కు, నాపూర్వ పుణ్యంబున న్నీదుకారుణ్యమూలంబున న్నిన్నికన్నాదు చిత్తంబునందున్, హరేబాలకృష్ణా, హరేముద్దుకృష్ణా, హరే రామకృష్ణా, హరేకృష్ణ కృష్ణాయటంచు న్సదాయింకధ్యానింపగా నేటికీబుద్ధి నాకుద్భవించెం గనీసంబుగా గాన, నారాయణా, భక్తసంత్రాణపారాయణా, యట్టి నాబుద్ధి ముందైన యీపాడుసంసారతాపత్రయంబందు బోనీక, నాయొక్క జన్మావసానంబుపర్యంతము న్నీపదాంభోరుయుగ్మంబునం దే, సదానిల్పియుండంగ గాపాడి రక్షింపవే, యట్లు రక్షించుచు న్మందికన్నాకు జన్మంబులేకుండ, యీమర్త్యజన్మావసానం బునందే భవత్పాదకంజాత సామీప్యమున్ జేర్పవే, యట్లు

యీమర్త్యజన్మాంతమందైన తొల్లింటి నాపుణ్యలోపంబుచే మిమ్ము జేరంగ నర్హుండగాకుండిన న్నేనుముందింక, నేజన్మముం బొందిన న్నీవు నాపై గృపంజూపి, యాజన్మమందే భవత్పాదపంకేరుహ ధ్యానపారీణుగా మాత్రముంజేసి కాపాడి రక్షింపవే, యట్లు రక్షించి నీకై సమర్పించియున్నట్టి యీ దండకం బెవ్వరేగాని భక్తితో వ్రాతురో, విందురో కందురో చింతనంజేతురో వారలంగూడ నీదివ్యపాదాబ్జ సాన్నిధ్యముం జేర్పవే, వేగ గోపాలపురీగ్రామవాస్తవ్య శ్రీ వేంకటజ్యోతిషజ్ఞ ప్రపోషా, యశశ్శ్రీవిశేషా, వసిష్ఠాపగాతీరవాసా, సితాంభోజనేత్రా, లసద్దివ్యగాత్రా, మునిస్తోత్రపాత్రా, నమస్తే నమస్తే నమస్తే నమః.



# ఆంధ్రజ్యోతిషాలయం



## అత్యద్భుత జాతక ఫలములు.

1. మీజాతకచక్రముయొక్క నకలుగాని, 2. పుట్టిన తేది తిథి వారము జననకాలఘడియలు లేక ఘంటలుగాని, రెండింటిలో నేవియో యొకటి మాకు పంపినయెడల—

1. జాతకుని రూపము, 2. స్వభావము, 3. శరీరదారుఢ్యము, 4. ధనసంపాదన, 5. సోదరసోదరీ వృద్ధి, 6. మాతృసౌఖ్యము, 7. విద్య, 8. భూమి, 9. వాహనము, 10. సంతానము, 11. శత్రువులు, 12. రోగము, 13 ఋణము, 14. కళత్రము, 15. కళత్రముయొక్క ఆయుర్దాయము, 16. భార్యాభర్తల అన్యోన్యము, 17. ద్వికళత్రయోగము, 18. జాతకుని ఆయుర్దాయము, 19. పితృసౌఖ్యము, 20. భాగ్యము, 21. ఉద్యోగము, జీవనము, 22. లాభము. 23. వ్యయము, 24. వర్తమానఫలము, ఈ 24 సంగతులు వ్రాసి 2-4-0 లకు వి. పి. గా పంపబడును. ఇవి నచ్చినయెడల అష్టకవర్గు షడ్వర్గు వర్గాలు కట్టి ద్వాదశభావములు మహాదశాంతర్దశాఫలములు ప్రమాణశ్లోకములతో ఆయుర్దాయము ఆఖరువరకు పూర్తిగజాతకము వ్రాయబడును. రు 10-0-0 లు అగును రు 4-0-0 లు ముందు అడ్వాన్సుగా పంపవలెను. మిగత సొమ్ముకు వి. పి. గా పంపబడును.

---

ఆకెళ్ల వేంకటశాస్త్రి, గోపాలపురం, కొత్తపేటపోష్టు. తూ॥ గో॥

## జ్యోతిష గ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | జ్యోతిష ప్రథమబోధిని | 0—8—0 |
| 2 | జాతకమార్తాండము 1 వ భాగం | 1—8—0 |
| | డిటో 2 వ భాగం | 1—8—0 |
| | డిటో 3 వ భాగం | 1—8—0 |
| 3 | ఆంధ్రజాతక తత్వసూత్రములు 1 వ భాగం | 1—8—0 |
| | రెండవ భాగం | 1—8—0 |
| 4 | బృహత్పారాశరసంహిత | 0—8—0 |
| 5 | గర్గసంహిత | 0—4—0 |

## జ్యోతిష విద్యా ప్రకాశిక

| | |
|---|---|
| 1 వ భాగం సంజ్ఞాధ్యాయం | 1—0—0 |
| 2 వ భాగం గణితాధ్యాయం | 2—0—0 |
| 3 వ భాగం భావఫలధ్యాయం | 3—0—0 |
| 4 వ భాగం దశాఫలాధ్యాయం | 2—0—0 |

### యివియే జ్యోతిషకళాపాఠశాల పుస్తకములు

యివి 7 భాగములు. మా జ్యోతిషకళాపాఠశాలలో జేరి జ్యోతిషము నేర్చుకొను ప్రతిపాఠమునకు పోష్టుద్వారా పంపి జ్యోతిషము నేర్పెదము. మాపాఠశాలలో ఎపుడు చేరినను చేరవచ్చును. నెల 1 కి రు 2—0—0 అగును. యింకను కావలసినయెడల వివరములు వ్రాసి తెలిసికొనుడు. పోష్టు ఖర్చులు కొనువారే భరింపవలెను.

ఆకెళ్ల వేంకటశాస్త్రి, గోపాలపురం,
కొత్తపేటపోష్టు, తూర్పుగోదావరిజిల్లా.